## సంక్రాంతివేదన (విజయ)

ఈ నా జీవనయాత్రలోఁ దరలి పోయెన్ బెక్కు సంక్రాంతు లా
యా నాళ్లన్ మధురానుభూతులకు లోనై లోకసంభావ్య న
వ్యానందమ్ముల నేలుకొంటి నిపు డేలా హార్ద్ర రేఖా దరి
ద్రాణత్వమ్ము ఘటిల్లె నాకు; భయ ముత్పాదిల్లె నేలా హృదిన్

పంటలు పండె, గిత్తలును బఱ్ఱెలు గొఱ్ఱెలు బల్మికల్మిమైఁ
గంటికి విందుసేయుఁ, దటకా పడఁదగ్గ ఋణాలు లేవు, వా
ల్గంటియు బిడ్డలున్ సుఖవికస్వరమూర్తులు, మాకరోత్సవం
బింటికివచ్చె, నేఁడు తపియించు నిదేల మదాత్మ భుగ్నమై

నెయ్యము లేక, తియ్యము గణింపక, నిక్కము నొప్పుకోక, రా
కయ్యము పెంచి, జాతిని గకావికలం బడవైచి, దేశమున్
వ్రయ్యలుసేయ నా తెలుఁగువారలు కోఅలుదీటువేళ నే
డయ్యక క్రయ్యఁబాఱ కకటా! యన కెట్లు సహింతు వేడుకల్

రాములిలక్ష్మ్యమైన మదరాసును ద్రోసి, రిసీ! బళారి మా
భూమిది కాదులే యనిరి, పోయిన బ్రహ్మపురమ్ము చేకొనం
బో మని, రింతయేల నడిబొడ్డునఁ దల్లికిఁ బీఁటవెట్ట మా
రాములుపట్టి రన్న; లదిరా! మన సుద్దు లిఁకేమి త్రవ్వెదన్

అటు కఠినోపవాసదహ నాహుతియై తనజాతి కింక సం
కటములు రావటంచు దివిఁగన్న వెలుంగు తెలుంగురాముఁ డీ
కుటిలతఁ జూచి యీచెడు తెగుళ్ళఁ గనుంగొని దుఃఖబాష్పముల్
జొటజొట గాల డీల్పడుచు స్రుక్కుచు వెక్కుచు నెంతపొక్కునో?

పదవుల కారటంపడి సభాపరిగ్రహణ కోర్చి జాతికిం
గొదవల నంటఁగట్టు ననుఁగుం దెనుఁగుం బ్రజలార! సత్యముం
జదువుఁడు, నిత్యమున్ నిలువఁ జాలవు గద్దెలు మేడ మిద్దెలున్
బ్రదికిన నాల్గునాళ్లు గుణభద్రులరై యశము న్గడింపుఁడీ !

నటునివిధాన, గంటకొక నాలుగువేసము లూనువాని కె
ప్పటికిని ముక్తి లేదు, నరపాలునకున్ సనసన్న లెంకకున్
జటిలునకున్ గృహస్థునకుఁ జక్కటి యొక్కటి లేనిచో జగం
బిటికల రువ్వకున్నను సహింప దహో! యని పూలుచల్లఁగన్

అన్న మటన్న బ్రహ్మ, మఖిలాన్నములం దెదియైన నేమి రా
జాన్నమె నాకుఁ బెట్టుమని యాడుదినాలు గతించె, వీనులున్
గన్నులులేని దద్దమలు గా రథునాతను , లావులించుచో
నెన్నఁగలారు ప్రేవులు ; జయింపవు నేఁడు పురాణదంభముల్

అడఁకువ నేర్చుకొందు, మన యర్హత లెట్టి వటన్న చర్చకుం
గడఁగుఁడు, వ్యక్తిలాభమును గాక సమాజశుభమ్ము నీకొనం
దొడఁగుఁడు, ధర్మదేవతకు దోయిలిపట్టుఁడు, లోకమెల్ల మీ
నడవడి ముద్దుసేయ సుగుణమ్ముల కిమ్ములుగండు సోదరుల్ !

పొరపులు పోరులు న్మఱచి, బుద్ధులు శుద్ధియొనర్చి, పూర్వ పుం
గరిమఁ దలంచి, దేశహితకాంక్షల కూపిరివోసి, పాలనా
పరిణతి సంతరించి, ప్రతిభల్ వెదచల్లుచు, జాతివైభవ
స్ఫురణకు వీరగంధములుపూయుఁడు కమ్మఁదనమ్ము నిండఁగన్

పదవికి సిద్ధాంతమ్మును
వదలిన రావృతులగతులు వగ నిడు – నైనన్
బదవిని సిద్ధాంతమునకు
వదలెడి సర్దారు లాంధ్రవసుధకు లేరా ?



# క్రొత్త వెలుఁగులు

అబ్బెను రాష్ట్ర మాంధ్రులకు నందు సమస్తవిధా వికాసముల్
ప్రబ్బెనయేని నాఁడు మనభాగములన్ విడఁగొట్టుకొంట కా
గుబ్బుగ నుద్యమింతమని ఘూర్జరముఖ్యులు వేచియుండి రే
సెబ్బరలేనిబాట కెడసెప్పక పొమ్ము యశమ్మునిండఁగన్

మానని మచ్చరాల మనమండలముల్ తెగి తన్నుకొన్నచో
నైనది సంబడంబని కటా! యెకసక్కెములాడ ద్రావిడుల్
పూనిక నున్నవారు మనపోకడయున్ బరిహాస్య మంట స
త్యానకు దవ్వుగాదు శతథా కృషిసల్పఁగదోయి పేర్మికిన్

విడఁదీసి యేలు నేల్బడి
కడునింద్యము; తెల్లవానికన్నిట్టి దటం
చెడపెడ చెడనాడితి మా
పొడ కన్పడరాద తెల్గుపోకడల నీఁకన్

దిట్టతనమున్న నాఁఉడి
పట్టుదలల్ తెలుఁగువారిపాలం బడె నీ
అట్టు సెడదేని రాముని
పుట్టెఁడుత్యాగమ్ము రిత్తపోవును గుఱ్ఱా!

సకలాంధ్రమ్ము వితండవాదముల నీర్ష్యన్ గాఱుఁజీఁకట్ల దం
డకమైపోవుట కోర్వఁజాలక మహిష్ఠస్థైర్యసంపన్న ధా
ర్మికదృష్టిన్ గుణకోటి మ్రోయ నిజమాతృక్షోణికిన్ సౌహృదాం
శుకముల్ క్రొత్తవెలుంగులిచ్చు రఘురామున్ గొల్చి రాణింపుమా

వసవలపు లుజ్జగిల్లని
నిసుఁగుగదా! రాష్ట్ర; మెంతనెఱియున్న నెదో
దోసఁ గుంట తప్ప దిప్పుడు
రుసరుసపాల్గాక మంథరుఁడ వగు మన్నా!

రవరవ లెట్టి వున్న మనరాష్ట్రము రేపు సమస్తభారత
స్తవము గడించినిల్చు మృదుసఖ్యమునన్ సముదారభావ వై
భవమున మంత్రతంత్రపరిపాకమునన్. నిరవద్యసంపదన్
నవనవశేముషీబలమునన్ గమనీయ కళాదరమ్మునన్

అమ్మబొజ్జలోనఁ దొమ్మిదినెల లున్న
నిసుఁగు బ్రదుకె వేయినెలలు దాఁట
నలువదేండ్లు నిల్చి తలచూపినట్టి యీ
పట్టిబ్రదిమి కానకట్ట కలదె?



# మగువలు

తెనుఁగుచరిత్రలో నతివతేజము దొడ్డది, జాతిపేర్మికై
మనవనితల్ వెలార్చి రతిమానుషశౌర్యము, త్యాగలక్ష్మికిన్
జననులు తెల్గుజోటులు, ప్రశస్తచరిత్రలు, వారిడెందమున్
దనిపిననాఁడె రాష్ట్రము సదాతనమై హవణిల్లుఁ దమ్ముఁడా!

అటువంగం బిటురంగమెల్లలుగఁ బ్రాజ్యంబైన సామ్రాజ్యము
త్కటధీశక్తి భరించినట్టి మనరుద్రన్ గానరో తెల్గు లు
ద్భటు లీనాఁ డిదియేమిటింత ప్రజలం బాలించుపీఠాల నొ
క్కటియున్ జానల కీయరైరి తగదా *కోటమ్మయీపాటికిన్?

వెలఁదులు తాల్మివీడి కనువిచ్చినచో మగవారిబింకముల్
గెలుచునె? యోటురాజ్యమిది కేవలకాంతలె పూరుషప్రజన్
గెలుతురుసంఖ్యలో, సతులకే కరమెత్తెడిభర్తలెందఱో
కలరు సహోదరుల్ గలరు కన్నసుతుల్ గల రప్పు డేమగున్?

తెగుదాఁక లాగరా దని
మగవార లెఱుంగవలయు మగువలుఁ దామున్
సగము సగమ్మగ రాష్ట్ర
ప్రగతియెడన్ బడలవలయు బ్రదుకులువెలయున్



* (మన శాసనసభా సభ్యురాలు)

# విద్యార్థులు

అద్దమునుబోని పోకడ
విద్దియలన్ గలితనమ్ము విరియువిధానన్
బెద్దలు బుడుతలబుద్ధులు
దిద్దనిచో రాష్ట్ర మెట్లు తిరపడుఁ జెపుమా!

బొడ్డూడనిపోఁడు తన
జడ్డంతయు రాజకీయచర్చకు బలిగా
నొడ్డగెడవైన చదువుల
గొడ్డాసల బుఱ్ఱగోఁకికొను నేఁ డిచటన్

ఒప్పనిదారికైనఁ దలయూఁచి పరీక్షల కొగ్గి యెట్టెటో
ముప్పది యంకముల్ వడసి ముంగమురారి ధరించెఁగాని నో
ర్విప్పుట కేమివచ్చు మనపిన్నకు? నన్నలు దుర్వివాదముల్
మప్పి కలార్థి నిట్లు కొఱమాలినవాని నొనర్చి రక్కటా!

రేపు జగమ్మునేలఁగల రేఖలుమీరు, తదీయ నైపుణుల్
చేపడకున్న మీరు వికసింపరు, లెండని, పెత్తనాలపైఁ
జూపిడి రేపవల్ బడలు జోదులు మచ్చులెఱుంగలేని లేఁ
బాపల నూఁపియూఁపి తమ బట్టులఁ జేసి రిఁకేమి సెప్పెదన్

దేశభక్తియన్న తెరదీసి పగటి వే
సాలుకట్టి తందనాలుపాడి
గద్దెవలచు నాయకమ్మన్యు లీ నేలఁ
జెఱచినారు విద్యగఱచువారి

వసుధకెట్టి చెట్టవచ్చినఁ బసివాని
ముట్టరాదు రెచ్చఁగొట్టరాదు
విలువ హెచ్చఁగాక విలయంబ యగుఁగాక
వి త్తనాలసంచి విప్పరాదు

చదువుసన్నగిల్లె సంస్కారమా చెడెఁ
బనికిరాని బిరుసు పాదుకట్టె
వెఱ్ఱిముదిరె నేఁటివిద్యార్థి కేమి కా
నున్నవాఁడొ వీఁడు తెన్నుదప్పి

లక్ష్యసిద్ధాంతములలోని లగ్గు లెగ్గు
తెలుఁగనగుఁ గాని విద్యార్థు లిదియ లోక
తారక మటంచు నొకదానఁ దగిలి తగిలి
పరుగు లిడరాదు దస్త్రముల్ పాఱవైచి.

బానిసమునఁ గ్రుయ్యు భారత మెట్టిటో
ముక్తమయ్యెఁ ద్యాగములు ఫలించి
నెఱయవలయు నిచట నీతి – విజ్ఞాన మీ
పాలికిఁ బిన్నవాంధ్రపూఁట హెచ్చు

అఖిలభారత పరిపాల నార్హమైన
* తెలివికిం జాలఁ డీనాఁడు తెలుఁగువాఁడు
కడకు రాష్ట్రమ్ము సాగించు నొడుపుసైత
మెఱుఁగఁ డెటేఁగిన దొక్కటే విఱుగఁబాటు

సాంకేతిక నైపుణి మన
యంకెకు రానట్టినేర్మియై బెడిసెఁ గదా!
యంకిలిగానని తమిళుల
పొంకము సూచినను సిగ్గుపుట్టద మనకున్



*(ఐ. ఎ. ఎస్. మున్నగు పరీక్షలలో వెనుకబాటు)

# వినాయకులు

పాపటదువ్వి చెల్వములు ప్రబ్బిన వల్వలు దాల్చి నాఁడెముం
జూపునలంకృతుల్ దొడిగి జోకలు వాఁకలుగట్టఁ బొల్తు రే
పాపలు వార లక్కరముపట్టని గిట్టని దుర్విదగ్ధు లీ
క్రేవులు రచ్చలెక్కి తలక్రిందుగఁ బత్రికఁ జూడ నవ్వగున్

గడ్డిదిని మేరదప్పిన
వడ్డీలు గడించి కన్నవా రుప్పరిగల్
గుడ్డము లిడ సిరిపొంగొక
గ్రుడ్డితనం బిడ నటించుక్రోఁతులు వీరల్

బావిలోనికప్ప లావంత సంస్కృతి
నెఱుఁగ రైననేమి తెలుగులేని
పొగరు తమకుఁగూర్చు ప్రెగడగా నెగడఁగాఁ
బల్లెపట్ల నేలు ప్రభులు వీరు

పెత్తనములెల్ల వీశే
గుత్తగొనం జూతు రధమగుణవత్త సదా
మెత్తురు మహాత్త దెసకున్
జిత్తము వోసీ రిఁకేమిసెప్పద వీరిన్

అన్నదమ్ముల నెడసేయ నాలుమగల
చివురుఁగాఁపురములఁ దీయఁ దివురుచుందు
రకట ! వీరికి శాంతి ప్రాణాంతకంబు
పండి పైకొన్నపొందికల్ గుండెబరువు

మతములనెత్తి విత్తపరిమాణములన్ వివరించి కోవలన్
వెతకి కులమ్ములం దడవి వీధుల నూరు - సివార్లఁ జూపి దు
ర్మతులగువీరు లోకము సమాయికమున్ గికురించి నాయక
స్థితిని గడించి పల్లియలచెట్టకు నాదరువౌదు రక్కటా !

గ్రామములు భారతీరుచి
ధామము లైనపుడె వీరు తలఁగుట జనతా
క్షేమము లొదవుట రాష్ట్ర
శ్రీ మెఱయుట పొసఁగు మధురజీవిక లెసఁగున్



# పేదలు

పేద కడుపుమంట పెరిఁగిన కాలాన
సాదు కంటినీరు సాగినపుడు
కాలుమోపఁగలరె కరటక దమనకుల్
పొంగిపోవఁగలరె పింగళకులు

లక్షలున్నవాని లాలించి లాలించి
బక్కవానిఁ గొంచెపఱచి పఱచి
పోటుమగలు బిళ్లబీటుగాఁ బడిరయా!
యోటురాక నిలువఁ జోటులేక

మేడకు మిద్దెకు గుడిసెకు
నూడలవ్రేలాడుచున్న యుట్టికిఁ గల దీ
నాఁ డోటు; తత్ కృపార్థులు
గూడెమ్ములవారి సేవకుం జనవలయున్

ఓటువలచువార లొక్కరకా కాత్మ
విలసనమ్ము వడయఁ దలఁచువారు
నెల్లవారి పెంపు నీకొన్నవారును
గదలవలయుఁ బేదబ్రతుకు దిద్ద

"ఆత్మవ త్సర్వభూతాని" యన్న పలుకు
మనది "సహనౌభున" క్త్వన్న మినుకు మనది
బోయ కాతిథ్య మిచ్చినపుణ్ణు మనది
శాంతికై మీఁదుకట్టిన జగతి మనది

ఎముకలగూఁడులై బ్రదుకుసీడ్చుట కొల్లక త్రెళ్ళ లేక శో
కములఁ దపించుచున్ సెగలుగ్రక్కు దరిద్రులఁ ద్రోసిపుచ్చు కా
లము చనె విప్లవాగ్ని దెసలన్ గబళింపకముందె యందలా
లమరినవారు మేల్కొని యహంకృతి నుజ్జనసేఁత లగ్గగున్

'నేను' విడిచి 'మనము'పై నిచ్చనిడని చో
దేశ మెక్కరాదు లేశమేని
క్రొత్తకఱద గాదు ముత్తాతలే యిది
సెప్పినారు కన్నువిప్పినారు.

చదువులేక గ్రుడ్డిబ్రదు కీడ్చు మానిసి
మందులేక రుజలఁ గుందుపేద
కూడులేక రాలువాఁ డున్నగడ్డకు
శాంతిలేదు జీవకాంతి రాదు

సో మెఱుఁగక బా మరయక
వేమఱు చెమరోడ్చువారు వెడపొట్టలతో
నేమహి నుందురు తన్మహి
సోమించుట కల్ల నిత్యశోభావృతమై

ఆఁకొన్న పండితుని గతి
ప్రాకెన్నలు చుల్కఁజేయు పామరుచందం
బీకొన్న రాష్ట్ర మేటికి
లేకున్నఁ గొఱంత లేవి లేచున్ వేఁచున్

తెగఁదిని తెగుళ్ళఁబడి మూ
లుగువారున్ మెతుకులేక లోచెడి చెడి నీ
లుగువారున్ మనకంటికి
నగపడరా దాంధ్రరాష్ట్ర మపుడే నిలుచున్

సోలుచుఁ గూలికి నేగిన
మాలెత పొలమందె గొబ్బిమండల నడుమన్
బాలకుని గనియె నతఁడీ
నేలకుఁ బిడుగో? వచింపు నిక్కపు నిసుఁగో?

నెలలు నిండి రొప్పునెలఁతను వరికోఁత
కంపు రాజ్య మెట్లు పెంపు వడయు
మాట లేల మన సమాజవ్యవస్థలో
మార్పువలయు దిద్దితీర్పువలయు

సంపన్నులు తమ బంగరు
గంపలకుం దాము ధర్మకర్తల యని భా
వింపవలయుఁ బేదలసిరి
పెంపవలయుఁ ద్రుంపవలయుఁ బిసిడితనమ్మున్

తనివి నతకరింపఁ దగుకల్మి పిసినారి
తనము నతకరింపఁ దగిన లేమి
లేమి నిక్క; "మానులే" యనుచున్ నరుఁ
డిచట దారిఁదప్పు నెంతవెడఁగొ

ఉన్నవారు తెల్వియున్నవారై సక
లోదయమ్ము దెసకు నొగ్గరేని
లేనివారు తాల్మిలేనివారై విజృం
భింపఁగలరు కట్లు త్రెంపఁగలరు

గజగజతో నెడచిక్కని
గజిబిజితోఁ బ్రాపులేని కాఁపురములతో
గిజగిజలాడిన ప్రజలే
నిజమైన జగచ్చరిత్ర నిర్మింతు రయా!

నరుఁడు తెచ్చిపెట్టినది గాన లేవడి
యతని కణఁపరాని దగుట యరిది
యిది యెటింగి సిరుల నేలుదొరల్ పేద
లెదురకుండు మేర నొదుఁగవలయు

భూదానయజ్ఞ మని * గురు
పాదులు దేశాలుపట్టి బడలుట విలయాం
భోదము గర్జింపమికే
పాదులుచెడి సంఘ మార్తిపడకుండుటకే



* పూజ్య వినోబా

## తెనుఁగు తీపి

తల్లి బాసతీపి తగులని మానిసి
దేశికవితనిగ్గు తెలియనతఁడు
జాతిరుచులు కానఁజాలని యంబేద
కాఁడు కాఁడు నాయఁకరము వడయ

నన్నయసూక్తి తిక్కన యనర్గళశిల్పము సార్వభౌమ పో
తన్నలశయ్య సూరనమహాకవికల్పన మాదరింపలే
రన్నలు; లాఁతిబాసలకు నంజలిపట్టెద రీవిపత్తి పో
కున్నఁ దెనుంగురాష్ట్రమున కున్నతియున్ గతియున్ హుళిక్కి రా!

అఱవము కన్నడమ్ము మళయాళముసంస్కృతమాంధ్ర పండితుల్
కఱచుట లెస్సయన్న నది కాదన రెవ్వ; రిదేమిసూత్రమో
యెఱుఁగఁ దెలుంగుసెప్పుటకు నింగిలిపీసున వ్రేలువెట్టుట
క్కఱయఁట నన్నచిన్నయల గాదిలిచుట్టలె కీట్సురెన్నులున్

ఉత్తమకావ్యసృష్టి నభియుక్తుల మెప్పులువొంది జాతికై
నెత్తురుధారవోయు కవినీరజగర్భులతీరుపై సదా
చిత్తమునిల్పి వారు వికసించుట యాత్మవికాస మన్న లో
కోత్తరధర్మమున్ బ్రెగడయున్ బ్రజయున్ దలఁదాల్చుటొప్పగున్

పట్టములేనివాని ప్రతిభాచతురత్వము లెంత మింటికిన్
వొట్టిననేమి వాని నొకదూలముఁగాఁ దలపోఁత లెల్లవా
ర్పెట్టినభిక్ష ; వచ్చినపరీక్షలకా వెలజాతె వీనికే
బొట్టిడిరేని జాతి చెడిపోవును దుర్బలధీవిశిష్టమై

జాతికిజీవగఱ్ఱలు ప్రజాహృదయమ్ములు నిర్వ్యళీక రే
ఖాతతముల్ సహేతురచనాంచితముల్ పరిశుద్ధభారతీ
కేతువు లైనకబ్బములకే ప్రసవమ్ములుచల్లు, మన్యముల్
నీతలక్రింద ద్రింఢులయి నిల్చుటకున్ దగవోయి తమ్ముఁడా !

పలుకులలో సమాసమున భావపథమ్మున నన్వయమ్మునన్
దెలుఁగుఁదనమ్ము క్రమ్ముకొనఁ దిక్కన సూరన వెంకనాదికుల్
మలచినబాటలో నడుచు మంజులశిల్ప పరిష్కృతుల్ కృతుల్
పొలుపు గడించుచున్ రసికభోగ్యములై రవళించు నిచ్చలున్

తెనుఁగుమఱుంగెఱుంగుటకుఁ దెన్గుమెఱుంగుఁహారంగు గంటకు
న్దెనుఁగునెడంద చాటుటకుఁ దెన్గునకైతలు వెల్వరింతకున్
మన యెకసక్కెముల్ వడయు మాలల కాఁపులతోడి చెల్మిలో
మునుఁగుట లెస్స; యీనుడికి మూదలయైరి నియోగికైసరుల్

చిన పెద రాచకార్యములు జీవిక తోట నియోగి చెంగటన్
మనవులవారు దస్త్రముల మూడల మోసెడివారు వారలై
దినముదినమ్ము ప్రబ్బి నునుఁదెల్గులు పల్కుచునుంట కుబ్బి తి
య్యనికవితల్ రచించి నుతులందిరి ప్రెగ్గడ లగ్గలమ్ముగన్

ప్రెగ్గడజాతి కప్పువడెఁ బెద్దయుఁ దెల్గుజగమ్ము, వన్నియల్
కగ్గని జిల్గుఁదెల్గునుడికారపు సొంపులపెంపులన్ నెఱా
పగ్గెలు చింద నాంధ్రి కులుపా లిడి మే లొడఁగూర్చి నారిలోఁ
ముగ్గుర కిద్దఱై బిరుదుమోసిరి యీసిరిగన్నకైసరుల్

ఒక తిక్కన సాలఁడె యీ
సకలాంధ్రమునకును జీవసంపద నొసఁగన్
వికసించినట్టి తప మి
ట్టి కొడుకుగా నవతరించె నటే! కొమ్మనకున్

కొమ్మనా! నిను మెచ్చుటన్ దనియ నీకుంగూర్చునిల్లాలి నా
యమ్మం గొల్చెదనన్నమాంబను దెనుంగాటాడుగుంటూరిలోఁ
గమ్మంగాఁపుర మూని యీ వెలఁది యీ కన్నయ్య పెన్నాఁకటిన్
జిమ్మన్ బొమ్మిడునాఁడె చేఁపినదిరా! చిన్నారి తెల్గుంబసల్

ఒగుడయి కుందు నాఁటినుడి కూటటసెప్పి మహాకవిత్వదీ
క్ష గొని పదేనుపర్వములు సాత్యవతేయకృతిన్ దెలుంగుపెం
పు గునియఁ బల్కినట్టి కృతపుణ్యుని తిక్కనపుట్టుగడ్డయా
నగరము గుంటపీడు తొలునాళులఁ బట్టినసోము లెట్టివో

కూఁకటిసొంపులన్ బెరుఁగు కొట్టరుతిక్కన కృష్ణగట్టునన్
దూఁకుచు మేనమామలు కుదుర్కొని వెగ్గలెడి వెల్లటూరఁదా
టాకులమీఁద వ్రాసికొనె నక్కరముల్ పదముల్; తదుర్వి నన్
సాఁకినకాణయాచిసరస న్గల దంటకు మేనుపొంగెడిన్

తనదెస దండనాథుఁడయి తన్ను గదించిన కొమ్మమంత్రికిన్
దనయుఁడు తిక్కనార్యుఁ డుపధావరిశుద్ధ చరిత్రుఁ డోట న
మ్మనుమవిభుం డెఱింగి బతిమాలి మహామతి నీతనిన్ నిజ
ప్రణిధి ఫలింప నిల్పుకొనెఁ బజ్జల నుజ్జ్వలకీర్తి దక్కఁగన్.

కొటటిపాటిరెడ్డి గుంటూరి ప్రెగ్గడ
యేటుకూరి కాఁపు పాటిమాల
గారపాటి కమ్మవారినెన్నుడి కవి
బ్రహ్మనోట మొరసె భారతముగ

తోఁచినతావు, దేశికులతో శ్రుతిశాస్త్ర పురాణకావ్యముల్
లోఁచినతావు, తెల్గునుడిలోఁతులు సూచినతావు, జవ్వనం
బాఁచినతావు, గర్తపుర మైనను గొమ్మనపట్టి గంటమున్
సాఁచినతావు మన్మనృపసత్తమునోలగ; మేమి సెప్పుదున్

చుక్కలమేలుముల్ గననిచోటులు, భానుమయూఖమాలికా
రుక్కులు సోఁకి వెల్గుట యెఱుంగనితావులు నుండుఁగాక స
మ్యక్కవితానిరూఢము, సమంచితధర్మరమాశ్రయమ్ము మా
తిక్కనభారతమ్ము నినదింపని తెల్గుపొలమ్ము లేదురా!

"తిక్కనకంటె మిక్కిలినదిట్టను మత్కృతు లొండురెండుగన్
లెక్కకునంద వొక్కదెస నిల్పితినా పెనువామి లేచు; నా
యుక్కన కెవ్వఁడడ్డ" మని హుంకృతిసేయుమగండు తాల్మికిన్
దక్కి గణించుటొప్పుఁ గవితన్ దనదానిఁ బఠించునాల్కలన్

తిక్కనముద్దుపట్టి సుకృతిప్రవరుం డగు కొమ్మమంత్రికిన్
దక్కినకూఁతు నాంధ్రవనితాజనతామణిఁ జిట్టమాంబికన్
మక్కువఁ బెండ్లియైన బలుమానిసి యల్లడమంత్రి కృష్ణతెన్
దిక్కున వెల్గు "రావెల"కు దేవర గర్వపు రాదవిష్ఠకున్

పెన్నగట్టునఁ దాఁ గుదుర్కొన్న నేమి
చుట్టుపక్కాలు గుంటూరిఁ జుట్టియుంటఁ
గొమ్మనామాత్యుఁ డిట్లు వీయమ్మునెఱపె
నైనసంబంధ మెవరు పోనాడుకొంద్రు ?

తిక్కనమన్మరాలికి సతీహిత కయ్యలమంత్రి పుట్టి ధీ
చిక్కణుఁడై వదాన్యకులశేఖరుఁ డయ్యె; నతండ తత్త్వపుం
జిక్కులు విప్పినట్టికవి సింగనకుం బిత; సోమయాజినె
త్రిక్కవిపాల నుంట నితఁ డేలె నుదాత్తకవిత్వయోగమున్

నాఁడున్ నేఁడును దెల్గుజాతి కొకవిన్నాణమ్ము సంధించి పై
దోడుల్ సూడిదవెట్ట గర్తపుర ముద్ద్యోతించు నల్వంకలన్;
ప్రోడల్ దాతలు ప్రెగ్గడల్ కవులు వీరుల్ మేదినీచంద్రమ
శ్చూడుల్ పుట్టినసీమరా యిది యశశ్శోభానివాసమ్మురా

ఎక్కడివాఁడు నన్నెకవి యెఱ్ఱనకొల్వొది సార్వభౌముఁ డే
దిక్కునఁ దోఁచె వాఙ్మయయుధిష్ఠిరుఁడై తగు భట్టుమూర్తి స
మ్యక్కవితాప్రవీణపదమాన్యులు సూరన రామకృష్ణు లే
చక్కి జనించి రీసకలసంపదకున్ గని గర్తభూమిరా

ఎలకూచిపండితుఁ డహో
బలుఁ డప్పకవీంద్రుఁ డాంధ్రభా షాకృతి కా
నలువెట్టినదిట్ట లిటన్
బొలిచిరిరా యిచటిగాడుపులు పీల్చిరిరా

అచ్చపుఁదెన్గుఁబల్కు దెస నాదటపుట్టినవారు కొన్ని నా
ళ్లిచ్చటనుంట లెస్స; వెడయేసలవాసనపొత్తులేని తె
న్గెచ్చటికేగినన్ గులుకు నిమ్మహిఁ; గమ్మఁదెలుంగుమల్లియల్
విచ్చినతోఁటరా యిది సవిత్రికి నున్మగఱాలపీఁటరా

మున్నటితిక్కనాదికవిముఖ్యు లొసంగినవాసి నిల్పఁగాఁ
గన్నిడి కబ్బముల్ నుడువుకై సరు లీసడిసన్నసీమ నీ
పున్నెపునేల మాదృశులు పొల్తురు నేఁడు; తెలుంగుబాస కీ
యన్నలు సేయు నూడిగము లచ్చము లగ్గలముల్ నెఱాసరుల్

తెలుఁగును విస్మరించి యిది తెల్గనిపల్కుచు బుంగపోఁత వో
సినగతి సంస్కృతమ్ము పడఁజిమ్మెద రేమి కవీంద్రు లక్కటా!
మనజనమెల్ల మేఘమును మాఘము నేర్చునె? నేర్వనేల? రా
జనములు మూల్గుచుండఁ జెయిసాఁచుట యేటికి వెల్వడాలకున్

పల్లెకుఁ బట్టణమ్మునకుఁ బ్రాఁకినవంచు నిలింపవాక్కులన్
బెల్లుగవాడి తెల్గుమఱపించుట దోసము; తెల్గువానికిన్
దెల్లముగాని తెల్గయినఁ దెల్గుకవిత్వము సెప్పువాఁడు కో
కొల్లగ వాడుటొప్పుఁ బ్రజకున్ హితమౌ నది సొంతకల్మియై

ఇంచుకసందుఁ జూచి తలయెత్తిన క్రొత్తమతమ్ముతోఁ బ్రవే
శించెను సంస్కృతంబు మన సీమకు సత్తులుచిత్తు లెన్నుచున్
మంచిదటంచు నాదికవి మక్కువసూపి తదీయవాణిలో
ముంచెను దెల్గుభారతము మోసినదయ్యది పల్లెపల్లెలన్

నన్నయ తెల్గుభారతి కొనర్చినసేవకు నంజలింతుఁ గా
ర్కొన్న మొగుళ్ళఁ జీల్చి తెలుఁగుంజదలింట నతండ మున్నుగాఁ
బ్రన్ననిదివ్యపెట్టె నది పల్మఱుమెచ్చెదఁగాని తెల్గుపైఁ
గన్నిడలేకపోయె నిది కాలమహత్త్వమొ? తత్త్వభేదమో?

ఎఱుఁగనిపల్కుగాదు తెలుఁ గీకవిమౌళికి; సోమయాజులన్
మఱచువిధానఁ దాఁ దెనుఁగుమాటలతేట లొకొక్కతావునం
బఱపెను; గాని తెన్గులకుఁ బల్కెడికైతల నెంతసంస్కృతం
బురలిననేమి యన్న తెఱఁ గొక్కటినేర్చె నిదెంతపాడియో?

డు ము వు లు సేర్చినంతన పుటుక్కున ముక్కలుగిల్లినంతనే
సమకుఱునా తెనుంగుసిరి సంస్కృతవాణికిఁ? బాణినీయ సూ
త్రములకుఁ దెల్గుకబ్బము లుదాహరణమ్ములె? తెన్గునెత్తు రీ
క్రమమున కోర్చునా? యుడికి గంతులువేయక నిబ్బరించునా?

గీర్వాణోక్తిమహత్త యే నెఱుఁగుదున్ గృత్స్నావనీభాషలన్
సర్వాంగీణసమృద్ధిగన్నుడి నా శంకింప నీపల్కు; నం
తర్వాణుల్ కవితాసుధాబ్ధులు ప్రచేతస్తోకముఖ్యుల్ కలా
పర్వానందవిధాత లందుఁగల రప్పా! కాళిదా సల్పుఁడా?

చక్కనికైతఁ బేర్వడిన సంస్కృతవాఙ్మయమున్ బఠించి ధీ
రుక్కులఁ బొందవచ్చు నెవరున్ దెగనాడరు దీని; కమ్మహా
వాక్కులసారమున్ దెలుఁగువారికిఁ దెల్గులుసెప్పునప్పు డీ
టిక్కులుసెల్లునా? గొనబుఁదెన్గున కందనిసొంపు లుండునా?

ఏనువేఱు తెలుఁగుమానిసివే అను
వాఁడు సొచ్చెఁ దెనుఁగువాడలోని
కతఁడు పొంచిపొంచి యందాలవెల్లి నా
తెలుఁగుతల్లి వెలఁదివెలుఁగు డించె

నీరము సూప మంచనక నీరని ప్రప్పని కూడువెట్టు చి
న్నారి వచించునేని సహనమ్మును వీడి "తుథూ నిషిద్ధ మా
హారముపొమ్ము నీకుఁదెలుఁగంటు తగుల్కొనెమున్గు"మంచు న
న్నారఁటకొందఱంధ్రులోకనాఁ; డిపుడున్గలరేమొ తాదృశుల్

మగఁడని పెండ్లమంచనిన మన్ననపోయెను భర్త, భార్య నాఁ
దగునని రుల్వకంబె నుపదానము తెల్లమియయ్యెఁ దియ్యముల్
మగుడుటఁబెద్దకుం బృధువుమాతృకయయ్యెఁ దెనుంగుబాసలో
సగము నశించెఁ దక్కినది చచ్చియుఁ జావనిదై వగర్చెడిన్

చావనితెల్గు పల్లెలకుఁ జాగినచో వినిపించు గంజికిన్
ద్రోవలులేక విద్యలనుదోఁగక నాగరకత్వ మింతయుం
బూవనితావులం బెరుఁగుపూపలు, పెద్దలు, తాత, లవ్వలున్
గావలియుంద్రుదాని కదికావలెఁ గైతకువెల్గు లీవలెన్

"దీపము-సంస్కృతోక్తి, యది తెల్గున కార్యులతోడవచ్చెఁ ద
ద్రూపమునుండి దివ్వెయనురూ పుదయించెఁ దదర్థ మిచ్చుటం
జూపెడి తెల్గులేమి మనచుట్టలు పూర్వులు దివ్యలేని క్రీఁ
గాఁపుర మోపియుం" డ్రని యొకండనన నప్పయ చూపెఁదిల్లికన్

అవ్వలబాస పండితుల కర్థముగాఁ దలతిక్కయజ్వ యా
మవ్వపుఁదెల్గు నేర్చెఁ గవిమండనుఁ డాతనికిఁ బ్రోత్తముట్టుతో
నివ్వెఱపాటుసెందిన మనీషుల కెవ్వరుకన్నువిప్పి రా
యవ్వలుకారె వారికడ నంజలిపట్టి శిరమ్మువంపుమా !

వఱువాత నేగి యూఱట
మెఱవడి గోరాలు తీసె మేఁగూలి యటం
చెఱుకులు మెఱకులు వల్కెద
రెఱుఁగరు పండితులు కవుల యిట్టి తెలుంగుల్

మొదట నిలింపవాణి తన ముక్కుడితోత్తు నొనర్చె నవ్వలన్
గదిమెను గోరి ఖిల్జి సరకారునుడుల్ కడలేనిజంకెలన్
బదపడి యింగిలీసు మనపాపఫలమ్ముగ వచ్చి రెచ్చి యె
ల్లిదమును జేసె హింది యదలించెడి నేఁడు తెలుంగునక్కటా!

ఆనాఁటికి నీ నాఁటికి
నానుడికిం దప్పదయ్యె నవఁత; భరింపం
గానిది యీనెగు లస్మత్
ప్రాణమ్మునుబోని పల్కుబ్రదుకి ట్లగునే !

తెనుఁగునఁ దీపిసూపినకృతిం గని నివ్వెఱపోయి మాయురే
మనపలుకా యిదంచు ననుమానమునంబడి కాదు కాదు పొ
మ్మని పరిహాసముల్ వలుకునయ్యలు నేఁడు తెలుంగుగడ్డలోఁ
గనఁబడుచుం డ్రిసీ! కొలఁదిగా ననఁజెల్లదు పల్వురుండఁగన్

అఱవల నిందుమెత్తుఁ బొరుగమ్మలువండిన పుల్లగూరపై
మరులిడి లొట్టవేయు నవమార్గము నొల్లదు వారినాల్క యీ
కఱ వొకతెల్గుమానిసి మొగంబుననే తలయెత్తె బాసనే
చెఱుచుటకాదు వీరు తమచిన్నెల నన్నిటిఁ ద్రోసి రక్కటా!

తెలుఁగుఁదనమ్ము పైకొనినతీరులు కన్పడువ్రాయసమ్ములే
తల, వల – నాఁటినుండి బుడుతల్ చదువందగు నిందు; నిట్టివా
కలిమికి నేలనేలునధికారులు పూనవలెన్ బ్రభుత్వ మీ
మెలఁకువనుండున ట్లనునిమేషము దేశము చూచుకోవలెన్

నిజమైన తెలుఁగు కఱవై
గజిబిజిబాసలు నటించు కైతలదెసకున్
బ్రజ లిఁక నేగంజెల్లదు
గిజగిజ లాడింపవలయుఁ గింగిరికవులన్

ఊరికి నొక్కలెంకవలయున్ దెలుఁగమ్మ; కతండు నిచ్చలున్
సూరెలవారి నోటిదెసఁ జూపిడి పీనిడి నానుడుల్ చమ
త్కారములూరు పల్కుబయకారము లెప్పటి వడ్డ పట్టి బం
డారము నేర్పరింపవలె డస్సినబాసకు బల్మిఁ దేవలెన్

ఏలపాటలు సుద్దులు జోలపాట
లేటిపాటలు తుమ్మెదపాట లచటి
తెలుఁగుఁదోఁటలు - వాని మేల్వలపులేని
బాస దయ్యాలబాస రాకాసిబాస

బాసచెడనేని కవితా
వాసనచెడు నాత్మధర్మవత్సలత సెడున్
వేసముచెడు రోసముచెడు
మీసముచెడు నెట్టియెట్టిమెఱుఁగైనఁ జెడున్

అచ్చపుఁదెల్గునం బలుకు టర్హము నాకు; నదైనఁ దెల్గువాఁ
డుచ్చునఁబడ్డరీతి జడియున్ బెడియున్; గథ యిట్టులైన నా
నొచ్చుట కేమిలగ్గని తెనుంగు కడల్కొనునట్లు లాఁతి ప
ల్కచ్చుటనచ్చుటన్ మొరయునట్లు రచింతుఁ గృతుల్ జగద్ధితల్

వారక తెల్గునాఁటఁ బదివందల యేఁడులనుండి నిండి వి
ప్పారిన సంస్కృతంపునుడి యంతలనింతలఁ దగ్గ దస్మదా
చారమునూఁది తెల్గుకవి సాగినచో నయిదార్త్రరాల కీ
భారముతూలి తెల్గులకుఁ బ్రన్నని తెన్గుపసల్ వశంపడున్

ఆకుల మీఁకులం బనక యన్నికులమ్ముల తెల్గువారికిన్
వేకువనుండి లౌకికపువెంపరలాట యొకండె చొక్కపుం
బోకడయాట నేఁడు గుడిపొట్టకు మాలయు వచ్చుచుంట నా
జూకుఁదెలుంగు లెల్లరకుఁ జొప్పడవచ్చు నిఁకన్ సజీవముల్

తెలుఁగువాని కైత దేశదేశాలకు
నోజబంతి యగుచు విజ్జుఁగాక
ప్రాజ్ఞుఁడై కలాతపస్వియై విశ్వసా
హిత్యరాజ్య మాంధ్రుఁ డేలుఁగాక !



## వా డు క బా స

నీమల నేగుపట్ల మనవీనుల కెక్కినపల్కు లన్నియున్
సాము లటంచుఁ బద్యకృతి సర్గ మనర్థమటంచు - నొండె - యు
త్త్యాదులనిల్పు రిత్తపని యంచుఁ గడున్ రగడల్ పొనర్చు దు
ర్వాదుల కొక్కదండ మిడి వారలనేరమికై తపింపుమా!

బడిఁగలపిల్లవాండ్రు పరభాషలపై గుఱినిల్పినట్లు క
న్నిడరు తెలుంగుపట్ల; నిదియే మనుడున్ మనబాసకై 'వెతల్
పడవలెనా యటండ్రు; పలుభంగుల మ్రోసెడి తల్లిబాసలో
మడుఁగగురూపు దేల్చు టన మాటలె? కుఱ్ఱ లెఱుంగ రింతయున్

వాడుకబల్కి "మీ రలసివచ్చి" రటం చొకనాఁడు పల్కితిన్
బ్రోడలు చెళ్ళపిళ్ళకవిభూపులు "గెల్వఁడు గెల్చిరే" నటం
చాడిరి, నేర్చి నేర్చి యిటు లైతిమి మే; మిది దేశభాషలో
మూడునవస్థ; కానఁ గనుమూయక యుంట శుభమ్ముపొమ్మిటన్

నాలుక కొక్కమైఁ దెలుఁగునాఁట నుడుల్ రవళించుఁజాలునున్
మూలయు లేని యీ తెలుఁగుముక్కలు వాఙ్మయవీధి కెక్కినన్
మే లదియేమి ? నల్దెసల మేరలువెట్టిన కావ్యభావపై
ఱాలను రువ్వఁజెల్ల దిది రాచఱికం బగునోటు ? తమ్ముఁడా !

రాచఱికమ్మునందుఁ బ్రభురాజ్యము లేచు నసిప్రభుత్వముల్
లేచును గాఁపుపెత్తనము లేచును బీదలపాలియేల్బడుల్
లేచు నొకొక్కవేళ; నిటులే కృతిరూపున మార్పుపుట్టుచో
లో చెడిపోవుఁ గాని కడలుంబలె సాహితి పొంగనేర్చునే ?

నన్నయ తిక్కనాదికవినాథులు వాడుకబాసలోఁ గృతుల్
పన్నిన వాని నిప్డు పెఱబాసలకబ్బము లంట తప్ప దా
తెన్నులు నేఁడు లేవు పలుతీరుల మాఱెను మాఱు నిల్లె రే
పు న్నిజ మిచ్చటం బలుకుపూఁటలు చెక్కనశాసనచ్ఛటల్

నన్నయకైత లప్పటిజనమ్మునకున్ గవితిక్కనార్యు వా
కొన్నది నాఁటితెల్గుప్రజకున్ బలిమై కడచన్న నీకు నా
కున్నది యేమి సెప్పు? మది యొప్పరికించుట కల్పభాగ్యమా!
పున్నెము పండి పండి మనభూమి కవిత్రయమున్ గడించెరా!

కావున బాసపట్ల నొకకట్టడ తప్పదు; ప్రొద్దువ్రాలినన్
దేవురుగొట్టులా కథలఁ దెల్పెడిపత్రిక లెట్లు వోయినన్
బోవఁగవచ్చు; దీన మనపుట్టి మునుంగదు కుఱ్ఱవాండ్రకున్
దీవరపాటు హెచ్చయినఁ దేఱి మథింతురుగాక సత్యమున్

ఇంతికి నంపచందముల నింతకొఅంతయు లేదు, రత్నపుం
గాంతులసొమ్ము లున్నవి, జగావలువల్ గల, వైన నేమి ధీ
మంతులు మెచ్చుశీల మణుమాత్రయు లే; దిఁక నాకె యేల? సి
ద్ధాంతము లుజ్జగించి కృతి యన్నది తాదృశయా తెలుంగుమా!

వాడుక బాస కారతులు వట్టినవారలలోఁ దెలుంగు వా
ప్రోఢతనమ్ము పొంటె నలపుల్ సయిరించినదిట్ట లెందఱో
చూడుము లెక్క ; నక్క తనచూఱల కందని ద్రాక్షపండ్ల నో
నాడినగాథ నీ వెఱుఁగవా ? తగవా ? యిటులాట తమ్ముఁడా!

పిలిచి బజారునన్ నిలువఁబెట్టి సవాలొనరించి "యేది మీ
తెలివి ? యలంతిగద్యమును దిన్నని తెల్గున వ్రాయుఁ" డంచు జ
గ్గులు పెడఁ దెల్గుబత్రికలఁ గూర్చు వలంతుల నిగ్గఁదీసినన్
వెలవెలఁబోని గుండెగల వీరులు నూటికి నల్గురుందురా ?

కట్టడలేని లేకినుడి గ్రామ్యము పెక్కుర కర్థమై నెఱా
చుట్టముగా రుచించు నని సుద్దులు ఫల్కెద రీప్రబుద్ధు ; లీ
చట్టము నూఁది వేఁకిఁబడి జాతినరోగికి నూనెగారెలం
బెట్టిన మెక్కఁడా ? తినినపిమ్మట నక్కలగడ్డ కెక్కఁడా ?

వారికి నింగిలీసునుడి వచ్చిన వచ్చునుగాక! దానఁ జే
కూరునె తెల్గుపైఁ జనవు? కూడని పెత్తనమేల? యాసకున్
మేరలు లేవె? బాస కిది మేలగునా? యగునేని "యాంగ్లపుం
దీరులు మార్పుఁ" డన్న వెనుదీసెద రేల బియేలు? తమ్ముఁడా!

పెఱనుడి కింగులీసునకుఁ బెట్టిన యూఱటచిన్నె సైతముం
జెఱుపరు, తల్లిబాస నిటు చిందఱవందఱపాలు సేతఁకున్
వెఱపడ; రైనవారలకు విస్తరివేయుట, కానివారికిన్
గరగరమైన క్రొంబసిఁడికంచముపెట్టుట యెట్లు సైతురో?

ఓపికయున్నవాఁడు తగునొజ్జలఁ గొల్చి సహస్రభాషలన్
నైపుణిఁ బొందవచ్చు నది నాగరకత్వమయౌను; గాని తా
రేపవలుం బ్రయాసము భరించి వరించి నిజోక్తిపైఁ గడుం
జూపిడి తద్విశిష్టతకుఁ జోటయినప్పుడ రాణకున్ దగున్

ఇంపున కింపు కంచుఁ జదివిచ్చె నటంచు మహాకవుల్ ప్రయో
గింపఁగవచ్చుఁ గక్కుఱితికిన్ బొరపాటునకున్ విధేయులై
కొంపలుగూల వింతన, దిగుల్పడ దాంధ్రి, "వాహ" శ్లటం చిసీ!
దుంపకు ముప్పుదెచ్చుపని దోసము పీసములగ్గు లేదిటన్

మనవిద్వత్కవులందుఁగొందఱుప్రజల్ మాటాడుగ్రామ్యంబుపై
నెనరుం జూపుచుఁ జిన్నచిన్నకథలన్ నిర్మింతురే కాని వా
రనవద్యస్థిరధర్మముల్ నుడువుకావ్యప్రక్రియల్ సంతప
ల్కనకర్పించిరె? సత్యమిచ్చటన తేలున్ దాల్మిమైఁ ద్రచ్చినన్

ఏఁబదియేండ్లనుండి మన యీ తెలుఁగుందొర లాంగ్లవాణికిం
బ్రాఁబడి మాతృభాషకు నిరాకృతిసల్పిరి తెల్గుపండితున్
ద్రాబను జేసి రాంధ్రమునఁ దప్పిది యొప్పిది యన్న తెల్వి లే
కీబడిఁ బెట్టి రున్నకిటు కియ్యదిరా! పలుమాట లేటికిన్

మును మనపల్లెకూటముల మోసినయొజ్జలు నన్నపార్య తి
క్కనకవి పోతరాజ కృత కావ్యములన్ దమశిష్యకోటికిన్
వినిచిరి విప్పిచెప్పిరి కవిత్వపుసొంపులుగుల్కు పద్యముల్
దినదిన మప్పగింపుఁ డని తీర్పులొసంగిరి ముద్దుముద్దుగన్

నలకథ సంధితంత్రములొనర్చిన కృష్ణుచరిత్ర రుక్మిణీ
లలనవివాహమున్ గజకులప్రభుమోక్షము దైత్యసూతి ని
శ్చలహరిభక్తి వామన విశంకటవిక్రమగాథ నాఁటి బో
ట్లుల రసనాంచలమ్ముల నటించెఁగదా పెదవార లుబ్బఁగన్

ఆటవిడుపుల వల్లింపు మనుచు మేలు
బంతి యిది యంచు గురుఁడు నాపాలి కిడిన
పద్యములు హృద్యములు ధర్మబద్ధములు శ
తాధికమ్ములు నానేర్మి కాదరువులు

అమరము వల్లెవెచి శతకావళిలో నుతులందికొన్న ప
ద్దెము లొకవేయిపాడి నెఱతెల్గునిఘంటువు లప్పగించి యా
దిమకవి బాలరామకథతీరు లెఱింగి తెలుంగుబాస క
బ్బము లయిదాఱునేర్చి యెడఁబాసితి నేనయగారి నాద్యునిన్

అతఁడు కావూరి - (శ్రీ)రాము లచ్ఛశీల
రాశి యార్వేలకులజుఁ డారాధనీయుఁ
డపుడు పల్లెలఁ దాదృక్షు లధివసించి
తెలుఁగుపస చూపి కుఱ్ఱల దిద్దువారు

ఏదీ! యీపస నేఁటికుఱ్ఱలకు వా రెన్నాళ్లు వేసారినన్
రాదే! పద్య మొకండుసైత మిఁక వీరా? తెల్గుసాహిత్యపుం
బాదుల్ దిద్దెడువారు? తాదృశులు నేఁబా సన్నమాత్రాన దు
ర్వాదంబుల్ సబలప్రమాణ మగునా? వర్ధిల్లునా? చెలునా?

ప్రాథమిక పాఠముల కున్నవంతు లెంత
నేర్చె నీనాఁడు ? బుడుతఁ డీ నేర్పులేని
యొజ్జకడ నేమివడయు ? ధీ విజ్ఞునట్లు
చాలువా ర్చ్ఛడరేని దేశము కృశించు

ఒత్తులతీరు వర్ణములయోజ లెఱుంగఁడు శబ్దరీతి కిం
చిత్తు గ్రహించిపల్కఁడు విశేష్య విశేషణభేద మెన్నలేఁ
డిత్తఱిఁ బల్లెకూటముల నేలుగురుం; డిఁక వానిశిష్యు ధీ
మత్త వచింపనేల యపమార్గమునంబడె నేఁటివిద్దియల్

ఉత్తమసాహితీబల సముజ్జ్వలుఁడౌ గురునిల్పి వానికిన్
బత్తెము లెస్సగానొసఁగి పల్లెబడిన్ సవరించుపొంటె భూ
భృత్తులు పూనుటొప్పు నిలఁబెట్టినకంబము పాఁతుచాలదే
నొత్తగిలున్‌గదా చిఱుతయున్ దొలువిద్యయు నిట్ల నాఁదగున్

ఉన్నతవిద్యపైఁ దగులముంచినపిల్లల కచ్చులైన రా
కున్న నెవండునేర్పు? నట నొజ్జలుసెప్పెడి విద్యవేఱు వా
రన్నది చక్కవ్రాసికొనునర్హత వీరికి లేనిచోఁ దరా
లెన్నిగతించినన్ తెలివియేర్పడునా తలయెత్తినిల్వఁగన్

మొదటిది తెల్గుబాసయఁట మూఁడవపల్కుఁట యింగిలీసు మం
చిదె యిది, కాని చిత్రములఁజిత్రము దోసములందుదోస మీ
తుదినుడివారి పెత్తనముతో బడిసాగుట వారిజీత మా
మొదలిటిబాసవారి కిడుముల్లెకు ముబ్బడియుంట తమ్ముఁడా!

ఈ నేతిబీరమన్నన
యీ నీచపుసంబళంబు నిడక వివేక
శ్రీ నేర్చి తెలుఁగురాష్ట్రము
నానారాష్ట్రముల కొజ్జనను సల్పవలెన్

మాయనిమచ్చగా విబుధమాళికి మున్ భృతి నాలుగైదు రూ
పాయలొసంగి యాతఁడలుపమ్ముగ మన్గడఁద్రోయఁ బుచ్చువం
కాయలశాస్త్రిగా రని పకాపకనవ్వెరి తెల్గు, లీ దుర
న్యాయమ పీఁటవెట్టుశనియై ప్రజలన్ గలఁగించు నేఁటికిన్

లోఁతులుసూచినన్ గొఱఁతలున్ వెతలున్ శతముండుఁగాక! పెన్
దాతలు నిండుకుండలుగఁ దారు చరింతురుగాని దీనులై
చేతులుసాఁపలేరు గురుశేఖరు లాఁకలగెల్చి యంబలిన్
సైఁతురు పూరికొంపలను సైఁతురు సైఁతురునాలిపీలికల్

అలఁతి వలంతి విద్యలకు నాంధ్రమునన్ దలయెత్తుసంస్థలన్
దెలుఁగుమఱుం గెఱింగిన సుధీమణి యేల్బడిసేయునప్పు డ
య్యలఘునకిచ్చు గౌరవ మనాంధ్రము లాంధ్రుల కంటఁగట్టు న
య్యల కిడుదానికంటె నుర వైనపుడున్ మనజాతి పైకొనున్

ఇంతలు నంతలైన మనయేలికలందఱు తెల్గువ్రాఁతకున్
సంతనకట్టి తీర్పవలెఁ జట్టము లానలు; పాడిపట్టులన్
గంతులువేయుచున్ దెనుఁగుగడ్డనుడుల్ వాగఁపందుకోవలెన్
వంతలుతీఱె నంచుఁ బెఱవాయి నెఱుంగనివారు నావలెన్

తెలుఁగుదివాణమందుఁ బరదేశపువాణికి వాసిమట్టు చో
వలచినరాష్ట్రమేల? యదివచ్చుటకున్ మనపెద్ద లక్కటా!
బలియగుటేల? యిట్టిదొరపాడియుఁ గానని వారు పెత్తనం
బులకుఁ బెనంగనేల? వనభూములకుం జనరాదె మానులై

రావలెఁ దెల్వి తెల్గులకు, రక్కసబాసలమీఁదినెయ్యముల్
సావలెఁ, దెల్గుకైతకు హసాదులొసంగెడి తీరుతియ్యముల్
గావలెఁ, దెల్గుఁబల్కుఁజెలి గజ్జెలఘల్లల లింటికింటి కి
మ్మావలె, నావలెన్ దెలుఁగులెల్లరు, తల్లికి వాసిదేవలెన్



# కదంబము

కోటిమంది ప్రజకుఁ గుత్తుకబంటిగాఁ
గూటినోసఁగు నందికొండమడుఁగు
బయలుమెఱసె నిట నపశ్రుతు లేలొకో
మాయకుండుఁగాక! మన యశస్సు

వండి పంపెడివారుండఁ దిండిలేక
మొగమువాఁచిన నాదారుమూఁక లుండ
నడుమ వడ్డించువారి కీ జడిమ యేల
యన్నదమ్ముల కూర్మి వెన్కాడనేల

సిరి రా మోఁకా లొడ్డక
కొఱవడ్డ మెఱుంగు రాకకున్ బడలఁ దగున్
బరికించిన మనకుం గల
నెఱి నేఁ డది యెంతకలదు? నెచ్చెలి! సెపుమా!

ఢిల్లీబంగరుకోటలో సచివపీఠిన్ దెల్గువాఁ డుండెనా?
యెల్లల్ దాఁటిన రాయబారు లెవరోయీ! సెప్ప నీవారిలోఁ?
జెల్లంజాలని దమ్మిడీ లయిరి సీ! సీ! తెల్గు లీనాఁటి కీ
క్రుళ్లున్ వాకొన రోఁతఁగాదు కడుపుంగోఁతన్ గుమారిల్లుదున్

ఒకరో యిద్దఱో ధీనిధుల్ మనకుఁ నేఁడున్నన్ దదీయప్రథా
వికలత్వమ్మున కెంతవిత్తమయినన్ వెచ్చించు నన్యాయ్యముల్
సకలాసత్యములున్ సహించుఁ దెనుఁగుంజాతం, బసూయావశం
బకృతారంభము నైనసంఘమున కెట్లాసాద్యముల్ భద్రముల్?

ఇంటన్ గెలువనివానిసి
కంటదురా రచ్చగెల్చునసువున్ జనవున్
వింటివె పొత్తుం బోలిన
పంట కనంబడదు నరుఁడుపడు సేద్యమునన్

విత్తమ సర్వసిద్ధియని వెంపరలాడుచు ధర్మదేవతా
దత్తముగాని కాసునకు దాయుచుఁ దెక్కలిమేఁత మేయుచున్
ముత్తెములట్లు పండినముముక్షువులంబలెఁ గానిపించుచున్
వత్తులు మ్రింగువారు మనవాడల నుంద్రు పరాకు తమ్ముఁడా!

చీఁకటిబేర మొందనుకఁ జేసిరొ లంచములెన్ని మెక్కిరో
వాకునకెక్కరాని యలవాటుల కెన్నిటికిన్ దెగించిరో
లేకులు పాకలన్ గెడపి లేపిరిమేడలు చంద్రశాలకున్
బ్రాఁకిరి కొయ్యమోర నడిబాటల నెత్తిరిఁ కేమిసెప్పెదన్

ఓనమా లెఱుంగఁ డోరిమయు గరిమయు
నానవా లెఱుంగఁ డైన నేమి
గీత మంచిదగుటఁ గిగ్గాడి చామీక
రాంగదముల వచ్చె రంగమునకు

సుడిదిరిగి తప్పుగాడ్పులు
కడుకొని వెడమనిసినోసటఁ గన్నొకనాఁ డే
ర్పడుఁగాక వాఁడు శివుఁడా ?
చెడగరమై మిడిసి కూలు శిశుపాలుఁ డయా !

ఆతఁడు కొమ్మువుట్టిన మహామహుఁడై యొకనాఁ డుదారుఁడై
పూతచరిత్రుఁడై జగముపొంగ వెలింగెనుగాక కాఁక యే
దో తఱచై తెగించి పెడత్రోవలు పట్టినపట్లసైత మా
భ్రాతను మెచ్చఁబోకు; తలఁపంజన విచ్చుటఁ బూర్వవాసనల్

చుట్టమటంచు మిత్రుఁడనుచున్ మొగమోడక యెవ్వఁ డెప్పు డే
కట్టిఁడిచేఁత సల్పినను గాదనిపల్కుము జాతిపేర్మికై
కట్టలఁతల్ భరించినమగండు రిపుం డగుఁగాక వానికిం
బట్టును పూల దోసిళులు బ్రహ్మరథమ్ము జగమ్మహో! యనన్

ధర్మమునకు సూనృతమునకుఁ గాక నీ
కేలజంకువలయు నితరమునకు
మంతుగన్నవారు మన్నించినట్టి దీ
తెరున పొమ్ము తత్త్వ మరసికొమ్ము

తగవు నిక్కమ్ము కలుచకు దబ్బఱకును
లోఁగి కొఱవోవుతఱి వానిసేగి నడఁప
దిట్ట తెగఁడేని యది వానిచెట్టగాక
పాడికి నిబద్ధి కోట రానీఁడు వేల్పు

విత్తమునఁ గామసుఖ మగు
విత్తము ధర్మమున వెల్లివిరియును గానన్
గ్రొత్తలు ప్రాఁతలు పాడికి
నుత్తమపీఠమ్ము నొసఁగి రుచితజ్ఞమణుల్

ఏకర్జ మొరుఁడు సల్పిన
నీకుం గన లామతిల్లు నీ వొరుదెస నె
ప్డాకర్జము గావింపమి
చేకొనుమా పుడమియెల్ల జేజేల నిడన్

నేతలువచ్చి ధర్మ్మవులునింతురు మంతురు చింతలన్నిటిన్
ద్రోతురు పాతు రం చెదురుత్రోవలుసూడక నీవులెస్స కీ
వే తగుయత్నముల్ సలుపు, మేల్బడి చేపడకున్న నేమి ధీ
చాతురి లేదెనీకు శతజన్మఫలమ్ము ? తెలుంగుతమ్ముఁడా !

కుక్కగొడుగులచందానఁ బెక్కుదెసల
లెక్కలేనన్ని వర్గాలు లేచె నిపుడు
గుట్టు తెలియక బంగారు కొట్టటంచుఁ
గదలకుము కాకిపసిఁడి దుకాణమునకు

వచ్చెఁ బ్రజాయుగమ్ము పదివందలయేండ్ల పిసాళిసంకెలల్
విచ్చె సమస్తఖండముల విప్లవరేఖలు భారతోర్వికిన్
జొచ్చె స్వజాతిసంస్కృతికిఁ జుట్టములై పొగడొందుధర్మ్మవుల్
మెచ్చుచు నచ్చపుం దెలుఁగు మేలిమి చాటఁగదయ్య తమ్ముఁడా!

నీకు రుచించుమార్గమున నీవు చరింపఁగవచ్చుఁ గాని తం
డ్రీ! కలనైన సత్యము నహింసయు లేబరమైనత్రోవకుం
బోకుము నిల్వనేర దవిపోయినసంఘము గెల్వనేర దా
రేకలులేని దేశము చరిత్రవెలార్చినపాత మానుడుల్

ఔచితి నెఱుఁగనివారికి
నైచికి నదలించి శునికి నతు లర్పింపం
జూచెడువారికి ధర్మవుఁ
ద్రోచెడువారికి నొసంగుదురె దొరతనముల్?

కారాగారములకుఁ జని
గారెలు మెక్కినవలంతికా క్రిమిరాసుల్
పేరినపులుసుం ద్రావిన
వీరునకా విరులదండ వేయుట? సెపుమా!

లాటీరక్కసి రక్కస
పోటులకున్ వ్రస్సి త్రెస్సిపోయినయెడలిం
జాటు నెఱజోదులను దెర
చాటునకున్ ద్రోయుజాతి చక్కంబడునే?

తోరణాలుకట్టి తోమాలియలు వైచి
పొగడు ప్రజలఁజూచి పొంగిపడక
పదవిలేనినాఁడు పదిమంది మన్నించు
వడుపెఱింగి బ్రదుకవలయుఁ బ్రెగడ

దినగండము నూఱేడుల
మనువైనది తెల్గువారి మన్నెటికం, బీ
యనయమ్ము నోర్వఁదలఁచిన
మన గఱువతనమ్ము వేయిమడుఁగులు వలయున్

కలమెత్తిన హలమెత్తిన
మలమెత్తినవారి నొక్కమైఁ జూడవలెన్
వలఁతియు నలఁతియు లేదిటఁ
బలువృత్తులు సాగినపుడె బ్రదుకులు సాగున్

తననేర్మిన్ దనయోర్మిని
దనపేర్మిన్ బెత్తనమ్ముఁ దనపల్కుపసన్
దనకల్మిని దనబల్మిని
దన బ్రదుకున్ గఱువ పెఱలతనివిక పంచున్

మన కాంధ్రత్వము ప్రాణము
తనువుసుమీ భారతీయధర్మము యావ
న్మను జాభ్యుదయ ప్రవణత
యనుజా! విను వజ్రకవచమై దిట వొసఁగున్

దేవుఁడన మాతృదేశమ
దేవత లనఁ బ్రజల యజ్ఞదీక్ష యనంగా
సేవావ్రత నిష్ఠయ యివి
జీవనసూత్రములుగాఁ బ్రసిద్ధిం గనుమా!

నీ కొలఁకుఁ గాక జాతి
శ్రీ కొలఁకే డస్సి డస్సి జీవింపుమయా!
నీకీర్తి విరియువెన్నెల
ప్రాఁకి దెసల్-కొసలు చివురుపట్టి రహింపన్

మేలు తెలుఁగుం బతాకకు
జే లాంధ్రప్రజకు మాతృసేవారతకున్
శ్రీలు తెలుఁగుంగృతికి జే
జే లాంధ్రతపస్వి పొట్టి శ్రీరాములకున్ ౨౦౧





# లఘు టీక

అదవిష్ఠ - సమీపస్థ
ఆసిప్రభుత్వము - సైనికరాజ్యము
ఇట్టిదోర - ఇటువంటి
ఇమ్ము - శాంతి
ఇల్లి - ఉపాసము
ఉరవు - అధికము
ఉలుపా - కానుక
ఉల్ప - ,,
ఊటచిన్నె - కామా (,)
ఎడ - లేఁత, దవ్వు
ఏస - వికృతోచ్చారణ
ఒడ్డగెడవు - బోలా
కఱద - నీతి, బుద్ధి
కలుచ - పాపము
కిగ్గాడి - అసమర్థుఁడు
కిగ్గు - జంకు
కింగిరి - అల్పము
కృతి - పని
కోవ - కులశాఖ
క్రించు - అల్పుఁడు
క్రుయ్యు - కృశించు
గబ్బు - పొగరు
గుడ్డము - చేను
చనవు - అధికారము
చెడగరము - క్రూరుఁడు
జాతము - సంఘము
జోక - అందము
తెన్ - దక్షిణము
దవీయాంసులు - దవ్వయినవారు
దేవర - ప్రభువు
దోర - మాదిరి
ద్రాబ - పనికిరానివాఁడు
నవఁత - కృశత
నాఁడు - దేశము (శాసనముఁబట్టి)
నాయఁకరము - ప్రభుత
నెట్టికసీలతనము - సదాచారము
నైక - అనేక
నైచికి - మంచిపాడియావు
పటి - రీతి
పాడితావు - కోట్టు
పాడు - మాలపల్లె
పూఁట - బాధ్యుఁడు, బాధ్యత
పూవని - వికసింపని
పొలి - లాభము
పోఱఁడు - బాలుఁడు
ప్రాకెన్న - పెండ్లివిందు
మోఁదు - ముడుపు
ముంగము రారి - ముంజేతికడియము
రొప్పుట - తోలుట
వేఁకి - జ్వరము
వాకలిమి - నోటి (మాట) నేర్పు
వెడ - అల్పము, వ్యర్థము
వెలఁది - శుద్ధమైన
సంహిత - సాహితి
సుబ్బుట - బయల్పడుట
సోము - సుఖము
సోమించు - అతిశయించు
స్వము - సంపద

# మా పద్య కృతులు

౧. బాపూజీ – ఆత్మకథ
 మేలిక్యాలికో ౧౦– ౦–౦
 సాదాక్యాలికో ౮– ౦–౦

౨. పఱిగపంట
 (ఖండకావ్యములు) ౨–౧౨–౦

౩. ఆత్మార్పణము ౧– ౦–౦

౪. ఉదయగానము ౧– ౪–౦

౫. రాష్ట్రగానము (అచ్చులో)

౬. ధర్మజ్యోతి ,,

౭. శబల (ఖండకృతులు) ,,


తుమ్మల సీతారామమూర్తి చౌదరి
బోర్డుహైస్కూలు పండితుఁడు
అప్పికట్ల (Via) బాపట్ల
(గుంటూరుజిల్లా)

